సర్వోదయ నమూనా ప్రకారం వుండేసమాజం జాతీయ నియమనిబంధనల్ని అనుసరించేది కాదు. సర్వోదయ సమాజ దృక్పథానికి జాతీయవాదం దూరం. అవి కాలం చెల్లిన భావాలు. సర్వోదయ సమాజంలో నివసించే పౌరుడెప్పుడూ విశ్వనరుడే. కానీ ప్రపంచ క్రమం కేవలం కొన్ని దేశాలైనటువంటి వాట్లో కేంద్రీకృతమైనట్లు ఊహించుకొంటే, అప్పుడు ప్రపంచ ప్రభుత్వం న్యూయార్క్, మాస్కో, జెనీవా మొదలైన మహానగరాల్నుంచి మనల్ని పాలిస్తుంటుంది. ఒక్కసారి ఆలోచించండి, ఇదెంత దుర్మార్గమయిన అణిచివేత సముదాయమో? ఇదంగీకరించదగిందని నాకనిపించడంలేదు. నేను మీ ముందుంచిన పద్ధతిలో మాత్రమే అలాంటి విశ్వక్రమం సాధ్యం. అత్యధిక అవసరాలన్నీ దిగువస్థాయిలో తీర్చబడినప్పుడు, ఎగువస్థాయి కొరకు కొద్దిపాటి సరంజామానే అట్టేపెట్టినప్పుడు, విశ్వక్రమం చాలా మెతగ్గా వ్యక్తిని గ్రహించినపుడు మాత్రమే ఏ వ్యక్తయినా దాన్ని అంగీకరించగలుగుతాడు. ప్రాపంచిక నియమాలు సులభంగా, సున్నితంగా వ్యక్తిపై ప్రభావం కలిగించినప్పుడే వాట్నొప్పుకోవడమనేది జరుగుతుంది.

నేను మీ ముందు కొన్ని పరిశీలనాత్మక భావాల్ని వుంచాను. కేవలం భారద్దేశానికే పనికొస్తాయనిపించిన ప్రజాస్వామ్య వికాస విధానాల్నే కాక విశ్వక్రమానికీ, ప్రపంచానికీ అవసరమౌతాయని అనిపించిన సునిశితాంశాల్ని సందర్భోచితంగా మీ ముందు పెట్టాను. మొత్తం జగత్తంతటి తరపునా వకాల్తా పుచ్చుకున్నట్టు ఆలోచించడం ఇవాళ మనకు సాధ్యం కాకపోవచ్చు. ఐతే, ఆచరణాత్మకంగా అభ్యసించడం మనిళ్ళలోంచే చేయొచ్చు. ఈ భావాలన్నిటి గురించి మీరంతా గంభీరంగా, చింతనాత్మకంగా ఆలోచిస్తారని నేను ఆశిస్తున్నాను. మన దేశంలో ఒక ప్రజాస్వామ్య క్రమానికి కట్టుబడి కొనసాగే సమాజాన్ని ప్రపంచమంతటికీ ఆదర్శప్రాయంగా వుండేలా సృష్టించడానిగ్గానూ, మనమందరం చేయి చేయి కలిపిముందుకు నడవాల్సిన తరుణమాసన్నమైందని మనస్ఫూర్తిగా నమ్ముతున్నాను.

ప్రథమ ప్రచురణ
రాడికల్ హ్యూమనిస్ట్ పత్రిక
సంపుటి XXii- 24, 25 సంచికలు
జూన్ 15, 22-1958



# సంపూర్ణ ప్రజాస్వామ్యం దిశగా
## (Towards a Fuller Democracy)

మూలం
**జయప్రకాష్ నారాయణ్**

స్వేచ్ఛానుసరణ
**గౌరవ్**

ప్రచురణ
**సెంటర్ ఫర్ డెమోక్రసీ**
ఆంధ్రప్రదేశ్ - తెలంగాణా

సంపూర్ణ ప్రజాస్వామ్యం దిశగా

(Towards a fuller Democracy)

| | |
|---|---|
| మూలం | : జయప్రకాష్ నారాయణ్ |
| తెలుగు | : గౌరవ్ |
| మొదటి ముద్రణ (ఆంగ్లంలో) | : జూన్ 1958 |
| ప్రస్తుత ప్రచురణ (తెలుగులో) | : మార్చి, 2015 |
| ప్రచురణ | : సెంటర్ ఫర్ డెమోక్రసీ |
| కాపీలకు | : 9032094492 |
| ప్రతులు | : 500 |
| ప్రతిపాదిత చందా | : 10/- |
| వివరాలకు | : gouravmeka@gmail.com |


---

".....Intellectuality seems to be on the decline in contemporary India. One would indeed have to search very hard among the educated people in this country to discover individuals who prefer and are able to think independently, or whose perceptions of the present developments are trained on close acquintance with and critical interpretation of even their own past cultural heritage."

**– Sibnarayan Ray**

Decline of the Indian Intellectuals

# అనువాదకుడి అంతరంగం

## 1

ఆ మధ్య కోల్‌కతా వెళ్ళినప్పుడు అక్కడి మిత్రుడు 'భాస్కర్ సూర్' ఆహ్వానం మేరకు 'రినైజాన్స్ పబ్లిషర్స్' కార్యాలయాన్ని చూసాను. అప్పుడు తీసుకొన్న పుస్తకాల్లో 'Sane voices for a disoriented Generation[1] గ్రంథం ఉంది. మానవేంద్రనాథరాయ్, [లక్ష్మణ్ శాస్త్రి జోషి ప్రకారం ఆధునిక భారతావని యొక్క మొట్టమొదటి తాత్వికుడు (first philosopher of Modern India)] సంపాదకుడిగా Indipendent India పత్రిక నడిపాడు. ఆయన ఔన్నత్యానికీ, దార్శనికతకూ ప్రతిబింబంగా ఆ పత్రిక చారిత్రక పాత్ర నిర్వర్తించింది. దానిలో ఆయన సమాజ ఆలోచనా విధానాన్ని సుసంపన్నం చేసే ఎన్నో విలువైన రచనల్ని ప్రచురించారు. ఐదు సం॥రాలకు పైగా ఇండియాలోని నాలుగు ప్రధాన జైళ్ళలో కారాగారవాసం చేసిన ఎమ్.ఎన్. రాయ్ నవంబరు 20, 1936న విడుదలైన నాలుగు నెలలకే తన సంపాదకత్వంలో "స్వతంత్ర భారతం" (Independent India)ను తీసుకొచ్చాడు. రాయ్ ప్రపంచ విప్లవాల్ని గురించిన చేసిన అనితరసాధ్య అధ్యయనం, మూడు ముఖ్య ఖండాల రాజకీయ కార్యకలాపాల్లో అప్రయత్నంగానే సముపార్జించిన అద్వితీయ అనుభవం ఆయనకు భారద్దేశానికి వైజ్ఞానిక సాంస్కృతిక పునరుజ్జీవనమే శరణ్యమనే భావాన్ని కలిగించాయి. దేశవ్యాప్తంగా చాలా బలంగా పాతుకుపోయిన రకరకాలైన సాంప్రదాయ ఛాందస ఆధిపత్య రుగ్మతల్ని సమర్థవంతంగా ఎదుర్కోడానికి నిర్మాణాత్మకమయిన సామాజిక, రాజకీయ, ఆర్థిక సాంస్కృతిక పునరుజ్జీవన పురోగతే మార్గమని తెలిసొచ్చింది. ఆ అవగాహనను నిరంతరం విస్తృతం చేసుకుందుకు ప్రయత్నించే క్రమంలో భాగంగా ఆయన ఒక్కొక్కటిగా అన్ని విధాల సంకుచితత్వాల్ని వొదిలించుకున్నాడు. పద్దెనిమిది సంవత్సరాల పసివయసులోనే నిషేధిత సాయుధ విప్లవ కార్యక్రమాల్లో చురుకుగా పాల్గొని, ప్రపంచ పర్యాటకుడిగా పేరొంది, మెక్సికోలో కమ్యూనిస్టుపార్టీని స్థాపించి దాదాపు దశాబ్దానికి పైగా ప్రపంచ సామ్యవాద సిద్ధాంత కర్తల్లో అతి ముఖ్యుడిగా

1. Sane voices for a disoriented Generation, selections from Independent India and the Radical Humanist by Einstein, Russel, Erick fromm, Julion Huxley, Ignazio Silone and Others, Selected and edited by Sibnarayan Ray, Renaissance Publishers, Kolkata- 2000.

వెలిగి, చివరికి రాడికల్ హ్యూమనిస్టుగా పరిణితి చెందిన రాయ్ జీవితం ఔత్సాహికులందరికీ ఒక శాశ్వతాద్భుతం. నిజానికి రాడికల్ డెమొక్రటిక్ పార్టీ స్థాపించేనాటికే ఆయనాలోచనల్లో సమూల మార్పు వచ్చినట్లు కనిపిస్తుంది. 1947లో "New Humanism, A Manifesto" అనే ప్రణాళికను ప్రవేశపెట్టేనాటికే రాయ్‌కు సమూల మానవవాదానికి సంబంధించిన స్పృహ ఉండేదనుకోవాలి. అందుకే 1948 డిసెంబర్‌లో రాడికల్ డెమొక్రటిక్ పార్టీని రద్దు చేయడం జరిగింది. ఏప్రిల్ 1949 నుండి 'ఇండిపెండెంట్ ఇండియా'ను 'రాడికల్ హ్యూమనిస్ట్' వారపత్రిగ్గా మార్చారు. రాయ్ తదనంతరం ఆయన సతీమణి, ఎలియన్ రాయ్, శిబ్‌నారాయన్‌రేలు సహ సంపాదకులుగా దాన్ని నడిపారు. తర్వాత కథంతా తెల్సిందే. ఐతే, ఈ పత్రికల్లో ప్రచురించబడ్డ హేమాహేమీల వ్యాసాల్ని సంకలనంగా చేసి, 'సేన్ వోయిసెస్ ఫర్ ఎ డిస్‌ఓరియన్‌టెడ్ జన్రేషన్' పేర్తో శిబ్‌నారాయన్ రే సంపాదకుడిగా ప్రచురిస్తూ 28 ఏప్రిల్ 2000 వ సంవత్సరంలో తీసుకొచ్చారు. ఐన్‌స్టీన్, బెట్రండ్ రస్సెల్, ఎరిక్ ఫ్రామ్, జూలియన్ హాక్స్లీ, ఫిలిప్ స్ప్రాట్ మొదలగువారి వ్యాసాలిందులో ఉన్నాయి. జయప్రకాష్ నారాయణ రాసిన 'Towards a Fuller Democrary' ని ఎందుకనో చదూతూనే తెలుగు చేసాను. అదెందుకాకట్టుకుందో తెలియాలంటే మరో విషయాన్ని ప్రారంభించాలి.

## 2

అనేక సమస్యల గురించిన అధ్యయనంలో భాగంగా తిరుగుతున్నప్పుడు గిరిజన గ్రామాల పరిస్థితులు వివరిస్తూ గ్రంథాలయాల అవసరాన్ని గుర్తిస్తున్నట్లు మిత్రులు చెప్పినప్పుడు ఎందుకనో నూతన తరహా లోతైన ఆలోచనా విధానాన్ని ఈ దేశంలోని పాలకవర్గం అత్యధిక శాతం ప్రజలకు దూరం చేసిన ద్రోహం ఇంకా కొనసాగుతోందన్పించింది. 'చదూకున్నవాళ్ళే నన్ను మోసం చేసార'న్న అంబేద్కర్ ఆత్మఘోషకి ఈ దేశపు విద్యావంతుల మౌనం, మేధోవంతుల అవకాశవాదం కారణాలుగా కనిపిస్తాయి. అందుకే Educate the Educators అన్నాడు రాయ్. ఈ విషయంలో గాంధీ విధానాల పట్ల జరిగే హుందాఐన విమర్శ కంటే కూడా, భగత్‌సింగ్‌నో, ఎమ్మెన్‌రాయ్‌నో, అంబేద్కర్‌నో అడ్డం పెట్టుకుని ఆనాటి పరిస్థితుల్ని నిజాయితీగా అంచనా వేసే ప్రయత్నం చేయకుండా గుడ్డిగా వెదజల్లే ద్వేషపు శాతమే ఎక్కువుంటోంది. స్వాతంత్ర్యోద్యమ కాలంనాటి చరిత్ర, దాని పర్యవసానాల్నీ అర్థం చేసుకోవాలంటే ముందుగానే నిర్ధారిత నాయకుల వ్యక్తిత్వాల



గూర్చి అనేక రంగుల్లో ఏర్పర్చుకున్న అభిప్రాయాల్ని వొదిలించుకోవాలి. తప్పొప్పుల పట్టికను తయారుచేయడం కోసం చరిత్రను విడగొట్టి బట్టీపట్టడం వల్ల శకలాలే మిగులుతాయి. ఈ పద్ధతి విధ్వంసానికి తోడ్పడినంతలా వినిర్మాణానికి ఉపయోగపడలేదేమోనన్న విజ్ఞత అవసరం. ఆధునిక తాత్విక పురోగమనంలో భాగంగా విభిన్న రకాల ప్రతిపాదనల్ని అధ్యయనం చేస్తున్నప్పుడు ఈసరికే జరిగిన ప్రయత్నాల పర్వం అప్పుడప్పుడు ఆశ్చర్యం కొల్పుతుంటుంది. భావితరాల సంక్షేమానికి ముందుతరాల దూరాలోచనపరులిచ్చిన గౌరవంలో వెయ్యోవంతైనా ఈరోజు మనం మన గతానికీ – భవిష్యత్తుకీ ఇస్తున్నామా అనే ప్రశ్నను పదే పదే వేసుకుంటే కాని సాంఘిక పరిణామాల్ని పూర్తిగా అర్థం చేసుకోలేం. వ్యవస్థ గమనాన్ని మలుపు తిప్పిన వ్యక్తులకు సంబంధించిన వివాదాల్ని కొనసాగించడంలో మనతరం చూపెడుతున్న ఆసక్తి, వారి ఆలోచనా క్రమాన్ని పాటించడంలో చూపలేకపోవడం ఆధునిక సమాజపు అతిపెద్ద లోపమనుకుంటా నేను. ఇద్దరు వ్యక్తుల మధ్యకాని, ఇరువర్గాల మధ్యగానీ, తలెత్తిన విభేదాల్ని ఆరోగ్యకరమయిన సంవాదం ద్వారా ఏ పద్ధతిలో సామరస్యంగా పరిష్కరించుకుని ముందుకు సాగామనే అంశంపై ఆధారపడి నాగరికతకల అనుచరులుగా ఆయా వ్యక్తుల, సంఘాల స్థాయిని అంచనా వేయగలిగేలా ఆధునిక మాననీయ దృక్పథముండాలే కాని గత వైషమ్యాల్ని మరింత పెద్దగా చేస్తూ విద్వేష వైఖరేర్పర్చుకున్నందువల్ల ప్రయోజం లేదు. గాంధీ, అంబేద్కర్, రాయ్, మొదలగువారు ఈరోజు జీవించుంటే వాళ్ళ ఆలోచనా విధానాలకు పట్టిన అధోగతిని చూడలేక, వారి పేరు చెప్పి సోకాల్డ్ నాయకులు – అనుచరులు సాగిస్తున్న సొంత దుకాణాల సంతల్ని భరించలేక ఈ దుర్గతిని ఖచ్చితంగా తీవ్రంగా నిరసించి కలిసి ఖండించేవారేమో. Independence and Social Justice[2] పేర్తో రాజ్‌మోహన్‌గాంధీ, పి.వి. నరసింహారావు స్మారకోపన్యాసంగా ఇచ్చిన వ్యాసం చదివిన నాకదే అన్పించింది. అరుంధతీరాయ్ అంబేద్కర్ రచన కుల నిర్మూలనకు "The Doctor And the Saint[3]" పేరిట రాసిన విస్తారమయిన ముందుమాటకు ఉన్నతమయిన జవాబుగా దీన్ని చూడొచ్చు. ప్రత్నామ్నాయ ఆలోచనా పద్ధతుల్ని

---

2. Independence and Social Justice, understanding the Ambedkar - Gandhi Debate, P.V. Narasimha Rao Memorial Lecture by Rajmohan Gandhi, Published by Emesco Books, Hyderabad - 2014, December.
3. Forward written by Arundati Roy to B.R. Ambedkar's 'Annihilation of Caste', Published by Navayana, New Delhi - 2013.

అభివృద్ధి చేసుకునే క్రమంలో భాగంగా, పూర్వం అదే తరహాలో మనసును నిమగ్నం చేసిన వారందర్నీ తెలుసుకోవాల్సిన కర్తవ్యం మనమీదుంది. గాంధీ, అంబేద్కర్, నెహ్రూ, రాయ్... ల నేపథ్యాన్నీ, వ్యక్తిత్వాల్నీ పరిశీలించినప్పుడు పాశ్చాత్య దేశాల తత్వశాస్త్రాన్నీ, ఈ దేశ జీవన విధానాన్ని అధ్యయనం చేసి లోతుగా అర్థం చేసుకున్నట్లు కనిపించినా, భారద్దేశానికి సంబంధించిన అరుదైన పరిస్థితులపై ప్రత్యేక శ్రద్ధ కనబర్చిన వారిలో మరికొంత మంది కూడా ఉన్నారు. రామ్‌మనోహర్ లోహియా, జయప్రకాష్ నారాయణ్‌లు ఇందులో మొదటి వరుసలోనివారు.

## 3

చార్వాక లోకాయతాలు, ఉపనిషత్ చింతన, జైన బౌద్ధ దర్శనాలు, క్రైస్తవ-ఇస్లాం మతాలు వ్యవస్థీకృతమయిన ధోరణుల్ని ధైర్యంగా ప్రశ్నించగలిగాయి. మధ్యయుగాల్లోని భక్తి ఉద్యమాలు మొదలుకుని తర్వాత కాలంలో ఆధునిక పునరుజ్జీవనానికి దారిచూపిన సూఫీ, సంఘ సంస్కరణోద్యమాలదాకా సమాజాన్ని ఎంతోకొంత ముందుకు నడిపించడం కోసం పడిన తపన, తాపత్రయాలే కనిపిస్తాయి. థామస్‌మూరే 'Utopia' గురించి ప్రతిపాదించక పూర్వం నుంచే ప్రపంచంలోని అనేక ప్రాంతాల్లో అనేక సందర్భాల్లో శ్రేయోరాజ్యం, సంక్షేమ ప్రభుత్వం గురించిన నమూనా భావనలున్నాయి[4]. మేథో వంతమైన ఆదర్శ రాజ్య భావనను ప్రజాస్వామ్యం, సమానత్వం, సహకారస్వామ్యమనే వాదనలు మరింత సుసంపన్నం చేసాయి. కమ్యూనిజం ద్వారా శ్రామిక రాజ్యానికి సంబంధించిన వాస్తవిక పరిస్థితుల్ని కల్పించడానికి అవసరమయిన సాధనాల్ని ప్రపంచ దేశాలన్నీ సమకూర్చుకోవాల్సిన పరిణామాలెదురయ్యాయి. సోషలిజం ప్రాతిపదికగా తలెత్తిన వివిధ రకాలైన సమానతా సిద్ధాంతాల్ని ఈ నేపథ్యంగా పరిశీలించినప్పుడు, భారతదేశానికి సంబంధించిన సామాజిక, ఆర్థిక, రాజకీయ చరిత్రను అవగాహన చేసుకునీ, తద్వారా ఇక్కడి సమాజానికో నిర్దిష్టమయిన ప్రణాళికాబద్ధమయిన ప్రజాస్వామ్య నిర్మాణాన్ని సూచించినవారిలో డా|| రామ్ మనోహర్ లోహియా విశిష్టమైనవాడు. వ్యవస్థ గమనాన్ని హేతుబద్ధంగా నిర్దేశించడానికి ఏ ఒక్క వ్యక్తి ఆలోచనా కేంద్రబిందువు కారాదనేది ఆయన తన తాత్విక భూమికకు ఏర్పర్చుకున్న ముఖ్యమయిన సూత్రం.

---

4. చూడు, ప్రజాస్వామ్య ప్రస్థానం, గౌరవ్, ప్రజా ప్రచురణలు (Center for Anarchist Studies (C.A.S.) తరపునుంచి, పిఠాపురం, తూ.గో.జిల్లా, 2011.



కె.యస్. చలంగారన్నట్లు ఈ అంశంలో లోహియా యోచనాధార అత్యంత అరుదైనది మాత్రమే కాదు కె.జి. కన్నబిరాన్ గారన్నట్లు సున్నితమైంది కూడా[5]. కేవలం సైద్ధాంతిక - తాత్విక భావజాల అధ్యయనానికీ, నూతన ప్రతిపాదనల రూపకల్పనకీ మాత్రమే పరిమితం కాకుండా సమకాలీనంగా తలెత్తిన అన్ని ప్రజాస్వామిక ఉద్యమాలలోనూ ప్రధానపాత్ర వహించి పాలుపంచుకున్నవాడు లోహియా. సోషలిజానికి సంబంధించిన తాత్విక ప్రాతిపదికను అసలెలా అర్థం చేసుకోవాలనే విషయాన్ని గూర్చి విస్తృతమైన చర్చ చేసాడాయన. ముఖ్యంగా 'Abstract And Concrete[6]' అనే వ్యాసంలో అమూర్తమయిన ఆదర్శవంత సిద్ధాంతాలకూ, వాస్తవ రూపంలో జరగాల్సిన ఆచరణీయమైన కృషికీ సంబంధించి లోహియా వేసిన మదింపు అతి కొద్దిమందిలో మాత్రమే చూడగలం. కార్ల్‌మార్క్స్ ) కమ్యూనిజాన్నీ, గాంధీ గ్రామస్వరాజ్యన్నీ, రాయ్ సహకారస్వామ్యాన్నీ, అంబేద్కర్ బౌద్ధ రిపబ్లిక్‌నీ, లోహియా సోషలిజాన్నీ, జె.పి. సర్వోదయినీ... ఇంకా ఇలాటి ప్రజాస్వామ్య సాధనాభావనల్నింటినీ కూలంకుషంగా చర్చించుకోగలిగి నూతన దిశలవైపు జరుగుతోన్న ప్రయాణ ప్రయత్నాల్ని స్వాగతించడం మినహా ప్రత్యామ్నాయోద్యమాలకు ప్రత్యేకమైన

---

5. చూడు, రామ్ మనోహర్ లోహియా శత జయంతి సంచిక, సంకలనం : రావెల సోమయ్య, ప్రచురణ : రామ్‌మనోహర్ లోహియా సమతా ట్రస్టు, లోహియా శతజయంతి ఉత్సవ సమితి, హైద్రాబాద్ - మార్చి 2010లోని కె.ఎస్. చలం గారి వ్యాసం 'రామ్ మనోహర్ లోహియా సామాజిక శాస్త్రాల అధ్యయన విధానం' పేజి - 53-58, అలాగే చూడు, 24 గంటలు కన్నబిరాన్ ఆత్మకథ, దేవులపల్లి పబ్లికేషన్స్, హైద్రాబాద్, జనవరి 2010 - కన్నబిరాన్ గారు రాసిన ఆంగ్ల రచనలో కూడా లోహియా సుప్రీంకోర్టులో వేసిన మౌలికమైన కేసు వివరాలున్నాయి. చూడు, The wages of impunity, power justice and Human Rights by K.G. Kannabiran, Published by Orient Longman Pvt. Ltd - 2004, Page - 4, The Saga of impunity article.
6. Collected works of Dr. Ram Manohar Lohia, Edited by Mastram Kapoor, Anamika Publishers, New Delhi - 2001, Page - 377-398. లోహియా ఆలోచనా విధానానికి సంబంధించి ప్రధానమయిన వ్యాసాలీ సంకలనంలో ఉన్నాయి. చూడు, Marx, Gandhi and Socialism, A Philosophical Hypothesis, Materiality and Spirituality, The Meaning of Equality, Driving forces of History... etc.

ప్రాతిపదికేదీ లేదు[7]. వీటన్నింటినీ కలగాపులగం చేయడంగా భావించేవాళ్ళకసలు వీటన్నింట్లో ఏకరూపంగా ద్యోతకమయ్యే అంతస్సారం అందదు. ఒకనాడు పేరొందిన నాయకుల పేర్లు చెప్పుకుని ప్రస్తుత సమస్యల్ని తోసిబుచ్చడం కోసం, తప్పించుకోవడంకోసం సాకులు వెతికేవారికి జీవితాంతం ఏదోరకమయిన 'వ్యాపకమే' ఉద్యమంగా కనిపించి గడిచిపోతుంది[8]. భావజాల ప్రచురణో, భావాల వ్యక్తీకరణో,

7. చూడు, Beyond Developmentality, Constructing Inclusive freedom and sustainability, by Debal Dev, Published by Danish Books, Delhi 2009, లో రచయిన భావితరాలపట్ల మన బాధ్యతను ప్రశ్నిస్తూ ప్రస్తుత వినిమయదారీ సంస్కృతికి వ్యతిరేకంగా సుస్థిర ప్రాకృతిక జీవన విధానాన్ని అవలంభించవలసిన ఆవశ్యకతను నొక్కిచెబుతూ 'Civic Democracy' ని ప్రతిపాదిస్తాడు. 'No matter what Marx's own view of nature was, the Marxist / Socialist State Practice has generally destroyed nature' అంటూ సామ్యవాద ప్రభుత్వాలుగా చలామణీ అవుతున్న రాజ్యాల బాధ్యతారాహిత్యాన్ని ఎత్తి చూపుతాడు. చూడు, ibid : Chapter-1, The Doctrine of Development Page - 45, చూడు, ibid : P-512 ప్రజాస్వామ్యం గురించి చెబుతూ, "but a civic democracy can function toward ensuring inter-generational equity and inclusive freedom only if its members actively participate in the process of change" ప్రత్యేకంగా పర్యావరణం గూర్చి కాదు గానీ, Terry Eagleton వ్రాసిన 'Why Marx was right" (Published by Seagull books, Calcutta 2012) అనే రచనను సాధికారికంగా విమర్శిస్తూ 'Was Marx Wrong?' అనే వ్యాసంలో సుభేదు సర్కార్, "However great Marx was in the final analysis, a human being living and working at a particular time in history. He could not cover every topic (including those that were yet to appear) under the Sun. He chose to look into the Principal Driving force of history and suggest a guideline to work for a better future. It is for others to study and control newer problems that might come up in the way of realising his vision. For he was in many ways, more correct than others." అంటూ ముగిస్తాడు. చూడు. "Was Marx Wrong?" by Subhendu Sarkar, Frontier Volume : 46, No.50, June 22-28, 2014.

8. "రాజ్యాలకు రాజులో ప్రెసిడెంట్లో ఎంత అగత్యమో ప్రజాసత్తాకాలకు నాయకులంత అగత్యం. నాయకులు పరంపరగా వెలుస్తూ, ఎప్పటికప్పుడు సరి అయిన దారిలో వెడుతూ వుంటేగాని ఏ జాతీ నిలకడగా వొక అంతస్తులో వుండదు. ఏ జాతికి నాయకుడు లేడో ఆ జాతివారు చదవ్వలసినవి చదవరు, చూడవలసినవి చూడరు, చెయ్యవలసినవి చెయ్యరు. మానవలసినవి మానరు. కప్పలతక్కెడలకీ ఆ జాతికీ



ఉపన్యాసాల ధోరణో, పత్రికల నిర్వహణో, ప్రదేశాల సందర్శనో, అభాగ్యుల నిరసనో, పేదవాడల పర్యటనో, పార్టీ-సంఘాల స్థాపనో... గొప్పగా అనిపించడంలో వింతేమీ లేదుగానీ వీటిలో ఏదీ ఏకమొత్తంగా దానికదిగా ఉద్యమం కాదు.

## 4

విస్తృతమయిన ప్రజాతంత్ర భావనకు ప్రత్యేక నిర్వచనమేదీ అక్కర్లేదను కుంటాను. ఆ దృష్ట్యా చూస్తే సామాజిక హితం కోరే సహృద్భావ ప్రయత్నాల్ని, అందుకోసమే కేటాయించి వెచ్చించే వ్యక్తుల జీవితాల్ని మినహాయించి ఉద్యమాల్నే పరమ పదార్థాలుగా చూడనవసరం లేదనుకొంటాను. ఏదోక సిద్ధాంతముద్ర వేసుకొని సంవత్సరాల్నుంచి పిడివాదనలతో, పితలాటకాలతో కాలం వెళ్ళదీస్తున్న మిత్రులందర్నీ ఏ సిద్ధాంతాలు అక్కర్లేదనే కొత్త సిద్ధాంతంతో గందరగోళపరచడం నా వుద్దేశం కాదుగానీ సామాజిక కార్యాచరణకు ఊతమిచ్చే వాతావరణంలో ఉద్భవించే జనహిత ఆరాటాలకు కచ్చితంగా ఏదోక పాక్షికమయిన ముద్ర అంటకట్టడం తప్పంటాను[9]. ప్రకృతి పక్షం వహించడానికీ - ప్రాపంచిక సమస్యల్ని ప్రశ్నించడానికీ బొత్తిగా తాత్విక జ్ఞానమక్కర్లేదనను గానీ అందుకోసం మంది మందలుగా చీలిపోయి అప్రకటిత అంటరానితనాన్ని పాటించనక్కర్లేదేమో ఆలోచించడమవసరం[10]. ప్రత్యామ్నాయ ఉద్యమ కార్యాచరణలో భాగంగా ఈ విషయాల్ని గూర్చి కుదిరినంతలో

మాత్రమే పోలిక. అచ్చంగా, యిప్పటికీ మన జాతి స్థితి యిది" అంటాడు శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రిగారు తన 'అనుభవాలూ - జ్ఞాపకాలూను'లో. అందులోనే "జన సామాన్యానికి రాజకీయాలే తారకం అన్న అజ్ఞానం పోతే తప్ప మనకి మరి గతి లేదు. ప్రాతిపదికలకు భంగం రాకుండా స్వధర్మానికి కొత్త సంప్రదాయం సృష్టించగల సమర్థులు ముందుకి రావడం లేదు ఇప్పటికీ మరి." అంటూ వాపోతారు. చూడు, పేజి-306, 340, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, హైదరాబాద్ - జనవరి 1999.

9. "... no book is genuinely free from political bias. The opinion that art should have nothing to do with politics is itself a political attitude". అంటాడు George Orwell, చూడు: Shooting an Elephant, Penguin Books - 2009, Page 5, Why I write?

10. "Philosophy, if it cannot answer so many questions as well would wish, has at least the power of asking questions which increase the interest of the world, and show the strongness and wonder lying just below the surface even in the commonest things of daily life" అంటాడు రస్సెల్, చూడు, The Problems of Philosophy, Oxford University Press, 1997, Page-16.

అధ్యయనం చేస్తూ నూతన మార్గాల్ని అన్వేషించే క్రమంలోనే విభిన్న విదానాల్ని గురించి వినడం, కనడం, చదవడం, పాల్గొనడం జరుగుతోంది. మిత్రుల్తో జరిగే చర్చలవల్ల ఎప్పటికప్పుడు కొంత స్పష్టత సంతరించుకుంటూ వచ్చాను. ఆ సందర్భంలో ప్రజాస్వామ్య పద్ధతిని విశ్లేషిస్తూ సాగిన ఈ వ్యాసం వర్తమానంలో జరుగుతున్న వివిధ రకాల సంవాదాలరీత్యా తెలుగులోకి రావడం ముఖ్యమని పించింది. ఐతే, లోహియా రచనల్ని అంతకుముందు తెలుగుచేయాలనే విఫలయత్నం చేసాను. అదేం అసాధ్యమనను కాని ఆ మాత్రం అభ్యుదయ భావజాలాల్ని పనిగట్టుకు చదివేవారికి అంతంత మాత్రంగానైనా ఆంగ్లంలో అర్థమయ్యే సర్దుబాటుండగా, తెలుగు సమాజం ఎన్నడో మరిచిపోయిన గ్రాంథిక పదాలతో కుస్తీపట్టి కొండంత శ్రమ తీస్కోవడం వివేకమన్పించలేదు. నాకెందుకో ఈ వ్యాసంలో మట్టుకు జె.పి. "Total Revolution[11]"లా అన్ని రకాల సిద్ధాంత ప్రాతిపదికలకూ వో నిర్దిష్టకత కనబడి తెలుగులో తేవాలనిపించింది. యమ్మెన్ రాయ్ ప్రతిపాదించిన 'సహకార ప్రజాస్వామ్యం' (Participatory Democracy), గాంధీ స్వరాజ్యం, లోహియా 'సోషలిజం' (సమాజవాదం), జయప్రకాష్ నారాయణ్ 'సర్వోదయ' సిద్ధాంతం, అంబేద్కర్ ప్రతిపాదించిన 'దళిత బహుజనుల బౌద్ధ రాజ్యాధికారం' ప్రాయికంగా వేరుగా కనిపించినా మౌలికంగా ఒక్కటేనంటే వివాదస్పదమవ్వొచ్చుగానీ అంతిమంగా విశ్లేషించినపుడూ, విశ్వజనీన దృష్టితో వీక్షించినప్పుడు నిజమని వివేచనాపరులెవరైనా కాదనలేరు. అంతమాత్రంలో వీళ్ళందరిదీ ఏకమొత్తంగా ఒక్కటే నిర్దిష్ట మార్గమని చెప్పడం లేదు. సాంఘిక స్థితుల్ని గురించిన వారి అధ్యయనం వారిలో ప్రవేశపెట్టిన భావజాలాలతో ఈరోజు అందరం ఏకీభవించలేకపోవచ్చు గానీ, ఆ భావోత్పత్తికి కారణమైన జిజ్ఞాసనూ, దాన్నుంచి ఉత్పన్నమయిన ఆచరణనూ మరింత ఉన్నతీ కరించుకునేందుకు ప్రయత్నిస్తూ, వాటిపట్ల మన నిబద్ధతకు భంగం కలగకుండానే ఇతరేతర భావజాలాల బాటసారులతో భవిష్యత్తు నిర్మాణానికి చేయూతనిందించి

---

11. Total Revolution by Jayaprakash Narayan, Sarva Seva Sangh Prakashan, Rajghat, Varanasi Feb-1992... "... New politics will be born from the womb of the peoples power" అంటాడిందులో జె.పి. చూడు: పేజీ-63, అంతేకాదు, ప్రజాస్వామ్యాన్నీ శాంతిని విశ్లేషిస్తూ, "Democracy cannot be made secure and strong without peace. Peace and democracy are the two sides of a coin. Neither of them can survive without the other". అంటాడు. చూడు, పేజీ-72.



పాటుపడ్డానికి మించిన సాంఘిక విజ్ఞతేమీ ఉండదనుకుంటాను[12]. ప్రజాస్వామ్య విధానానికి సంబంధించిన నూతన చర్చలు లేస్తున్న ప్రస్తుత తరుణంలో మేధావులు, పౌరసమాజం, ప్రజాసంఘాలు దీంట్లో వారి పాత్రను ఆరోగ్యకర రీతిలో పోషించడమవసరం. అవసరమున్న అన్ని అంశాలపట్లా, అవకాశమున్న అన్ని సందర్భాల్లో ఇలాంటి సంవాదాలకి తెరదీయం కనీసంగానైనా భావ్యమనే కోణంలోనే ఈ వ్యాసానువాదాన్ని చిరుపొత్తంగా తెస్తున్నాం. సమకాలీన సమాజపు సమస్యల్ని గురించి ఆలోచించడానికీ పట్టించుకోడానికీ ఏకాస్త సమయం కేటాయించి ఏదోక రూపంలో వారి విలువయిన కాలాన్నీ, వనరుల్నీ, శక్తియుక్తుల్నీ వెచ్చిస్తున్నవారి కేరూపంలోనైనా ఇందులోని సంగతులు గ్రహించగలవ్వనీ, పరిగణనలోకి తీసుకోవల్సినవనీ అనిపించినా ఈ కార్యం విజయవంతమయినట్టే భావిస్తాను. కొంతమంది స్వార్థానికీ, ప్రత్యేక సౌకర్యాలకీ ప్రతినిధిగా నిల్చిన వ్యవస్థ స్వరూపాన్ని అర్థం చేసుకుని వారి అక్రమాల్ని రక్షించడమే లక్ష్యంగా పనిచేస్తోన్న ప్రధాన స్రవంతి భావజాలానికి ఎదురొడ్డి ప్రజానీకానికి మేలు చేయడం కోసం ప్రత్యామ్నాయ ప్రయత్నాలు చేస్తున్నవారంతా భిన్నాలోచనల్ని[13] (Diversity of Ideas) ప్రజాస్వామికంగా ఆహ్వానించాలనీ, గౌరవించాలనీ ఆశిస్తూ, ఆకాంక్షిస్తూ ఇప్పటికిక్కడికాగుతాను.

**- గౌరవ్**

---

12. "Honour to those brave warriors who, through countless ages of warfare, have preserved for us the priceless heritage of liberty, and have kept undefiled by sacrilegious invaders the home of the unsubdues" అంటాడు బెట్రండ్ రస్సెల్ A Freeman's Worship వ్యాసంలో. చూడు, Two modern Essays on Religion, Westholm Publications, 1959, Page-33. ఇందులో ఈ వ్యాసంతోబాటు The Faith of a Naturalist అనే John Burroughs వ్యాసం కూడా ఉంది.

13. "అభిప్రాయాలు భేదించవచ్చు, తమ అభిప్రాయాలే తామనుసరించనూ వచ్చు; కాని భిన్నాభిప్రాయాలుండకూడదనడమూ, భిన్నాభిప్రాయాలు గమనించకపోవడమూ మౌర్ఖ్యం" అంటారు శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రి, చూడు, అనుభవాలూ-జ్ఞాపకాలూను పేజీ-285. అలాగే the civilized world has need a fundamental change if it is to be saved from decay-change in its economic structure and in its philosophy of life అంటాడు రస్సెల్, చూడు, Why men fight, The century Newyork Publishing - 1917, Page - 266.

# సంపూర్ణ ప్రజాస్వామ్యం దిశగా
## (Towards a Fuller Democracy)

### I

పార్లమెంటరీ ప్రజాస్వామ్యానికి నేను ఆక్షేపణకారుడ్నవడం చేత దాని స్థానంలో మరింత మెరుగైన ప్రజాస్వామ్యాన్ని కోరుకుంటాను. ఐతే, నేను ప్రజాస్వామ్యానికి శత్రువునైనందువల్లే పార్లమెంటరీ ప్రజాస్వామ్యాన్ని వ్యతిరేకిస్తున్నానని అపార్థం చేసుకోవద్దు. ఎందుకనంటే, ఆధిపత్యాన్ని, నియంతృత్వాన్ని ఎట్టి పరిస్థితిలోనూ నేను సమర్థించను.

నిరంకుశత్వమనేది మనిషిపై జరిగే నేరమంటాన్నేను. వ్యక్తి స్వతంత్రాన్ని ప్రజాస్వామ్యానికి దూరంచేసి అవమానించే విధానమది. స్వేచ్ఛ కోసం ప్రయత్నించడమనేది స్వతహాగానే మనిషికుంది. నిరంతరం అణిచివేయబడ్డానికి అంగీకరించలేని స్వభావమేదో సహజంగానే అతడికుంది. అందుకే, నేనో ఆశావాదిని. నాకు భవిష్యత్తులోని ప్రజాస్వామ్యం మీదా, మానవుడి అంతరికేచ్ఛ, ఆత్మ గౌరవాలమీద నమ్మకముంది అయితే, ఇప్పటివరకూ మానవాళి ఎరిగిన ప్రజాస్వామిక వ్యవస్థలన్నిట్లోకీ కూడా పార్లమెంటరీ ప్రజాస్వామ్యమనేది తక్కువ తప్పులుగలదిగా వుందనడంలో సందేహాలక్కర్లేదు. కానీ, దానర్థం ఇందులోని తప్పుల్నీ, లోపాల్నీ కళ్ళు మూసుకుని అంగీకరించమని కాదు. చెడుగుల్ని తొలగించుకుని, మెరుగైన ప్రయత్నం చెయ్యకుండా వుండటం కూడా కాదు.

ముందుగా, పార్లమెంటరీ ప్రజాస్వామ్యమే పరిపూర్ణ ప్రజాస్వామ్యం కాదు. ఇదో అసంపూర్ణ, చాలీచాలని ప్రజాస్వామ్యం. నా యీ అభిప్రాయానికర్థం ఏమిటంటే, ప్రజాస్వామ్యానికెన్నో నిర్వచనాలున్నాయి. మేధోపరమైనవి, పాండిత్యపరమైనవి, శాస్త్ర సంబంధమైనవి ఎన్నో ఉన్నాయి. కాని అబ్రహాం లింకన్ చెప్పిన నిర్వచనాన్నే ఇక్కడ తీసుకుందాం. ప్రజలచేత ప్రజల కొరకు ప్రజలతో నడిచేదే ప్రజాస్వామ్యం. పార్లమెంటరీ ప్రజాస్వామ్యం ప్రజల కొరకు పనిజేసే ప్రభుత్వమని అనుకోవచ్చు. ఎన్నికలయ్యే పద్ధతిని బట్టి ప్రజలచేత నిర్ణయించబడే వ్యవస్థని కూడా ఒప్పుకోవచ్చు. కానీ పై నిర్వచనంలో మూడో భాగమైన 'ప్రజలతో' అనేది మాత్రం ఈరోజు ఒప్పుకునే స్థితిలో మనం లేమంటే ఎవరికీ అభ్యంతరం వుండదనుకుంటాను. ఇది ప్రజల అంగీకారంతో నడిచే ప్రభుత్వమవ్వచ్చునేమో కాని ప్రజలతో నడుస్తున్న ప్రభుత్వం కాదు, ప్రజాప్రభుత్వం కాదు.



ఈ పార్లమెంటరీ ప్రజాస్వామ్యానికున్న మరో కోణమేంటంటే, రాజకీయ పార్టీల మూలంగా ప్రస్తుత వ్యవస్థ అనివార్యంగా పార్టీల పద్ధతిలో కూరుకుపోయింది. అయితే, ఆంగ్ల భాషా దేశాల్లా రెండు పార్టీల పద్ధతి, లేకపోతే పాశ్చాత్య యూరపు దేశాలైన ఫ్రాన్స్, జర్మనీల్లా అనేక పార్టీల పద్ధతే మనకి దిక్కయ్యింది.

ఒక్క పార్టీ పద్ధతనేది పార్లమెంటరీ ప్రజాస్వామ్యానికి అపరిచితమైనది, అన్యమైనది. ఈ పద్ధతిలో కనీసం రెండు లేదా అంతకంటే ఎక్కువ పార్టీలు ఉంటాయి. అధికార పార్టీ ఒకటుంటే, ప్రతిపక్షం ఒకటుంటుంది, లేదా ఒకటికంటే ఎక్కువుంటాయి. ఈ పార్టీలన్నీ కూడా ప్రజానీకం నుంచి వచ్చినవే. ఏదో మేరకు ప్రజల్లో వీటికి పరపతి వుందనడంలో సందేహం లేదు. అయినప్పటికీ అవే ప్రజలకి ప్రాతిపదిక కావు. ప్రతి రాజకీయ పార్టీ కూడా మరో పార్టీ కంటే తామే ప్రజలకి ప్రాతినిధ్యం వహిస్తున్నామంటాయి. ఈ పార్టీ పద్ధతికంటే కూడా ఉన్నతంగా నిర్మితమైన పార్టీ యంత్రాంగాలున్నాయి, కేంద్రీకృత యంత్రాంగాలున్నాయి. వీటన్నింటికీ సొంత నిధులు, ప్రచార సాధనాలు వున్నాయి. ప్రజలకు వాళ్ళ ప్రతినిధుల్ని ఎన్నుకునే అవకాశమున్నప్పటికీ, ఈ పార్టీల ప్రజాస్వామ్యంలో ప్రజలకిచ్చే ఈ ఫలితాలన్నీ పరిమితంగానే వుంచబడ్డాయి. తమకి ప్రాతినిధ్యం వహించే వ్యక్తుల్ని నిర్ణయించుకునేందుకు అవసరమయిన అవకాశాలు అంతంతమాత్రంగానే ఇవ్వబడ్డాయి. పెద్ద ఎత్తున సమీకరించబడిన నిధులతో పెద్ద పెద్ద రాజకీయ నేతల నడుమ స్వతంత్ర వ్యక్తులు నిలబడి ఎన్నికల్లో పాల్గొవడం కష్టసాధ్యం. ప్రసిద్ధి చెందిన నాయకులతో సామాన్య ప్రజల్లో నుంచి వొచ్చిన అభ్యర్థులు ఎదురొడ్డి నిలవడం సులువుకాదు. అందుకే, పార్లమెంటరీ ప్రజాస్వామ్య విధానాల్లో స్వతంత్రఅభ్యర్థుల సంఖ్య స్వల్పం. వాస్తవానికి అస్తిత్వంలోనున్న రాజకీయపార్టీలు తమ ప్రాబల్యంతో నిర్ణయించి నిలబెట్టిన అభ్యర్థుల్ని మాత్రమే ప్రజలు ఎన్నుకోగలుగుతున్నారు. ఫలితంగా, ఎన్నికలనేవి మనలాంటి పేద దేశాలకు సైతం చాలా ఖరీదైన వ్యవహారంగా తయారయ్యాయి. కాని, దీనికింకా పరిష్కారం దొరకలేదు. ఎన్నికల్లో పోటీచేసే అభ్యర్థుల ప్రచార వ్యయానికి సంబంధించి నిర్దిష్టమయిన పరిమితులతో కూడిన నిర్దేశికాలున్నా అవన్నీ ఆచరణాత్మకంగా అమలవ్వవు. అలాంటి నిబంధనల్ని న్యాయంగా పాటించడంకంటే వాటిల్లోని లొసుగుల్ని వాడుకోడమే ఎక్కువన్న విషయం అందరికీ తెల్సిందే. ఇంతటి దుబారాగా ఎన్నికలనేవి వున్నప్పుడు ప్రజలకు తమ అవకాశాల్ని వినియోగించుకుని ప్రతినిధుల్ని ఎన్నుకునే భాగ్యమేది? ఇవన్నీ మనం దృష్టి సారించవలసిన ముఖ్యమైన లోపాలు.

ఇదే విషయాన్ని మరో కోణంలోంచి చూద్దాం. వోటరు తన ముందుంచబడిన అంశాలపై స్పందించి తన అభిప్రాయాన్ని ఎన్నికల్లో వ్యక్తీకరిస్తాడనేది సిద్ధాంతం. ఏ దేశంలోనయినా సాధారణ ప్రజానీకానికి మేధోపరమైన క్లిష్ట విషయాల్లో అభిప్రాయాల్ని ఏర్పర్చుకోడానికీ, దానిని ఎన్నికల్లో వ్యక్తీకరించడానికి వీలుంటుందా? ఇక మన స్వదేశం విషయానికొస్తే, ఈ వెనకబడిన వ్యవస్థలో అత్యధికశాతం మంది నిరక్షరాస్యులు, ఎక్కువమంది తమ జిల్లా దాటి ఎన్నడూ పెద్దగా ప్రయాణించనివారు. ఇలాంటి వారు అంతర్జాతీయ వ్యవహారాలకు సంబంధించిన అంశాల్లో తమ అభిప్రాయాన్ని నిర్దిష్టంగా వ్యక్తపరచగలరా? వివేకవంతమయిన సమాధానాల్ని సాధించగలరా? వీటన్నింటినీ పరిగణనలోకి తీసుకుని మాత్రమే మన పరిస్థితులకు తగిన మెరుగైన పద్ధతిని కనుగొనాలి.

అభివృద్ధి చెందిన దేశాల్లో కూడా వోటరు వివేకంగా ఆలోచించి ఎన్నికల్లో తన అభిప్రాయాల్ని వ్యక్తీకరించే పరిస్థితిలో లేడు. నేను అమెరికాలో చదూకుంటున్నప్పుడు ఒక అమెరికన్ విశ్వవిద్యాలయం నిర్వహించిన సర్వేలో తేలిందేంటంటే 17% పౌరులకి వాళ్ళ దేశాధ్యక్షుడెవరో తెలీదు. చాలా సంవత్సరాల క్రితం సంగతిది. అప్పట్లో 17% ప్రజానీకానికి వాళ్ళ అధ్యక్షుడెవరో తెలీలేదు. బహుశ తర్వాత అమెరికన్లు మెరుగయ్యారనుకుంటాను. ఇదే సర్వే భారతదేశంలోనైతే ఎంతశాతం నమోదవుతుందో తెలీదు. కాన్పూర్‌లో జరిగిన ఒక సివిల్ సర్వీసు పరీక్షా పత్రంలో డా॥ రాజేంద్రప్రసాదెవరు అని అడిగిన ప్రశ్నకి కొంతమంది విఖ్యాతినొందిన వైద్యుడనీ, మరికొంతమంది సైనికాధ్యక్షుడనీ జవాబిచ్చారంటే మీరు ఆశ్చర్య పోవాల్సిందే.

ఈ పార్టీ పద్ధతిలో కొట్టొచ్చినట్టు కనిపించే దోషాలు వేరేవి కూడా వున్నాయి. మీకందరికీ అది తెలుసు. టేమెనీ హాల్ గురించి మీరు వినే వుంటారు. ప్రతీ దేశానికీ తమదైన టెమెనీహాల్ వుంటుంది. బొంబాయి నగరానికి కూడా వో టెమెనీహాల్ వుంది. కొంతమంది రాజకీయనేతలు, బడాబాబులు వీటిల్లో అవినీతి బంధుప్రీతిలకు తావిస్తూ పెత్తనం చెలాయిస్తుంటారు. అన్ని రకాలైన పక్షపాతాల్నీ పెంచి పోషిస్తూ అక్రమాలు చేయడం కోసం అధికారాల్ని వాడుకొంటారు. ఇలాంటి పార్టీ పద్ధతిలో ఏవి మంచిదో, ఎవరు సరైనవారో తేల్చుకోవడం అంత తేలికేం కాదు. అలాంటప్పుడు సొంత పార్టీ బలాబలాల మీదున్నంత ఆసక్తి విధానాల మీదుండదు. మన దేశపు రాజకీయ రంగంలో నేను చూసిందేంటంటే, ఒక రాజకీయ పార్టీ నాయకుడు ఆర్థికంగా అవినీతికి పాల్పడి డబ్బు తిన్నందుకు పార్టీ నుండి బహిష్కరింపబడితే, ఇతర రాజకీయ పార్టీలు అతడ్ని ఆనందంగా కౌగిలించుకుని



తమ పార్టీలోకి ఆహ్వానించడానికి సిద్ధంగా వుంటాయి. కొద్దో గొప్పో సమర్థవడంచేత అలాటి వ్యక్తిని స్వాగతిస్తాయి.

మనది సంక్షేమ రాజ్యం. కాని మనకి కనిపిస్తోందేమంటే లోకం రోజురోజుకీ మరింతగా కుదించుకుపోయి కేంద్రీకృతమైపోతోంది. రాజ్యాలు, ప్రభుత్వాలు మరింతగా అధికారంలోకి కూరుకుపోతున్నాయి. అది సంక్షేమ రాజ్యం కానివ్వండి, సోషలిస్టు ప్రభుత్వం కానివ్వండి, కమ్యూనిస్టు పాలన అవనివ్వండి, పాలనేదయినా క్రమం మాత్రం యిదే కొనసాగుతోంది. సాంఘిక జీవనానికి సంబంధించి ఎటువంటి కర్తవ్యాలకూ కట్టుబడని బాధ్యతారహితులుగా ప్రజలు తయారయ్యారు. ఇష్టమొచ్చినవారికి వోట్లను వేసి తృప్తి పొందుతున్నారు. పౌరులుగా విధులు నిర్వహించడం మినహా వారిక చేసేదేమీ లేదు, కాన చేయాల్సినదంతా రాజ్యమే చేస్తోంది.

ఇప్పుడు నేనడగాలనుకుంటున్నది ఏంటంటే, కేంద్రీకృత నిబంధనల ఆధారంగా సాగుతున్న సమాజంలో ప్రజాస్వామ్యానికేమంత అవకాశముంటుందని. పండిత నెహ్రూ, మేక్‌మిలన్, ఐసన్ హోవర్ మొదలగువారు ఆంతరంగికంగా నిజమైన ప్రజాస్వామ్యవాదులే కావొచ్చు. కాని సమాజంలోని సంస్థాగత విధానం మొత్తంగా కొన్నిచోట్ల మాత్రమే అధికారం కేంద్రీకృతమవడానికి కారణమౌతోంది. ప్రజాస్వామికవాదులు ప్రజాస్వామ్యానికి న్యాయంచేస్తూ, ప్రజలకి ప్రజాస్వామిక మార్గంలో జీవించడంపై అభిరుచి కలిగిస్తున్నప్పుడిదెలా సాధ్యం? ఎలాగంటే, మీకందరికీ తెల్సు, మరింతగా రాజ్యమే సర్వస్వమయి పోయింది కనుక.

సంక్షేమం, సోషలిజం, కమ్యూనిజాలే కాకుండా ఈరోజు సాధారణ నమ్మకమేమంటే సైన్సు కూడా కేంద్రీకృతానికి (Centralisation)కి కట్టుబడి పనిచేస్తోందని. విజ్ఞానశాస్త్ర ఫలితాలన్నీ రోజురోజుకీ సంకుచిత పరిధికే పరిమిత మౌతున్నాయి. సమాజం, శాస్త్ర సాంకేతిక రంగాలు రానురాను సంక్లిష్టంగా మారిన ఈ విజ్ఞానశాస్త్ర యుగంలో ప్రజాస్వామ్యం తన ధర్మాన్ని ఎంతవరకు నిర్వర్తిస్తుందన్న ప్రశ్న తప్పనిసరిగా తలెత్తుతుంది. కేంద్రీకృత వ్యవస్థలో కోట్లాది ప్రజల జీవితాలకు సంబంధించిన ప్రధానమయిన నిర్ణయాలన్నీ కేవలం కొద్దిమంది తీసుకుంటారు. దాన్నే మీరు ప్రజాస్వామ్యమంటారా? ప్రస్తుత కాలాన్ని ప్రణాళికా యుగమంటున్నారు, కేంద్రీకృత విధానంలేని ప్రణాళికలు అసాధ్యం కాబట్టేనేమో. పండిట్(నెహ్రూ)గారు ప్రణాళికలకు సంబంధించీ ప్రజాస్వామిక నేపథ్యంతో మాట్లాడుతున్నారు. ఐతే, అసలు మన దేశ ప్రణాళికలో ఏ రకమైన ప్రజాస్వామ్యం వుంది? ప్రణాళికా సంఘానికి ఏవో కొన్ని కమిటీలున్నాయి. ప్రణాళికలు తయారుచేసే నిపుణులున్నారు, ఏవో

కొన్ని చర్చలు జరుగుతాయి, కొందరు వారు నేర్చుకున్నదాంతో వ్యాసాలు వగైరా రాస్తారు. అభివృద్ధి కౌన్సిల్‌లో ఏదో కొద్దిపాటి చర్చఅనంతరం చిన్నపాటి సవరణలతో జాతీయ ప్రణాళిక ప్రకటించబడుతుంది. సైన్సూ, సోషలిజం ఇవన్నీ మనల్ని మరింత సంకుచిత కేంద్రీకృత జీవనవిధానం వైపు తీసుకెళుతున్నాయంటోందందుకే. ఈ రకమైన అభివృద్ధి క్రమం ప్రజాస్వామ్య విధానాలకి బొత్తిగా ప్రతికూలమైనది.

అప్పుడేం చేయమంటారని మీరడగవచ్చు. అదే మిత్రులంతా ఆలోచించాలని కోరుకుంటున్నాను. దీనికేం చేయాలి? చెప్పుకోదగ్గ సామాజిక శక్తుల్నుంచి మినహాయించబడిన మానసిక దృక్పథం ఒకటుంది. సామాజిక శక్తులకు ఎదురీదుతూ, సాంప్రదాయిక క్రమానికి ఎదురొడ్డడం వల్ల వుపయోగం లేదు. ఈ పరిస్థితుల్లో సాధ్యమైనంతలో ప్రజాస్వామ్యాన్నెలా పరిరక్షించుకుంటామని మాత్రమే మనం ఆలోచించి ప్రయత్నించాలి. మరో వైఖరి ప్రకారం జీవితంలో రాజీపడ్డానికి సిద్ధపడని నిర్దిష్టమయిన లక్ష్యాలు, విలువలు, విశేషాలు వున్నాయి. ఒక్కొక్కటి జీవితంలోని అత్యయిక పరిస్థితులతో పోరాడ్డానికి సిద్ధపడినవే. ఇలాంటి దృక్కోణాన్నే విప్లవాత్మక దృక్పదమంటాం.

ప్రజాస్వామ్యమనేదో జీవనమార్గం, జీవన అభ్యాసం, జీవించడం కొరకు ఏర్పర్చుకునే దృక్పథం. జీవితాన్ని ప్రజాస్వామ్యం తనలో ఇముడ్చుకుంటుంది. జీవన అంతరంగాన్ని ఆలింగనం చేసుకుంటుంది. వ్యవస్థ ఆర్థిక నిర్మాణంలో మార్పు తేకుండా కేవలం రాజకీయ నమూనాని సవరించడం ద్వారా మెరుగైన ప్రజాస్వామ్యాన్ని సృష్టించడం సాధ్యం కాదు. మెరుగైన ప్రజాస్వామ్యం కోసం మొత్తం సామాజిక జీవనరంగమంతా మరింతగా ప్రజాస్వామీకరించబడాలి.

ఈరోజు మానవ సమాజ చిత్రమెలా వుందంటే ప్రతీ మనిషీ కొద్దోగొప్పో మరో మనిషితో యుద్ధం చేస్తున్నాడు. అంతర్యుద్ధం గురించి మనం చాలా వింటున్నాం. ఈ ప్రచ్ఛన్న పోరాటమనేది మరింత ప్రమాదకరమైనదని త్వరలోనే మనకు తెలుస్తుంది. ఇతర యుద్ధ విధానాలతో పోల్చిచూస్తే, ఈ పద్ధతి మరింత హానికరమైనది. కానీ, మన దైనందిన జీవితాల్లో, సమాజంలో శాశ్వతమయిన ప్రచ్ఛన్న యుద్ధం సాగుతోందన్న విషయం మీకు తెలుసా? నేను నీతోనూ, నువ్వు నాతోనూ యుద్ధం చేస్తున్నామని మీలో ఎంతమందికి తెల్సు. జీవితం అలాగే రూపొందించబడుతోంది. సోషలిజమైనా, కమ్యూనిజమైనా ఈ పద్ధతిలో పెద్దగా మార్పుంటుందని నేననుకోవట్లేదు. సమకాలీన సమాజంలో స్వప్రయోజనాలు, స్వార్థపరత్వాలే మన జీవితాలకు మూలాధారాలు. స్వార్థప్రయోజనమే జీవిత చోదక శక్తి. స్వప్రయోజనం సామాన్యంగా కుటుంబ స్వార్థంతో ముడిపడుంటుంది.



మనమేదైతే చేయాలని చూస్తున్నామో అదంతా మనకోసం, కుటుంబం కోసమే చేస్తున్నాము. ఈ రకమైన సంకుచితత్వంతో కూడిన అంతర్యుద్ధం చేస్తూ ప్రజాస్వామ్యాన్ని రక్షించే సైనికులవతారమెత్తడం సాధ్యమని నేననుకోవడం లేదు.

మనిషి సాటి మనిషిని శత్రువుగా చూస్తూ యుద్ధం చేస్తున్నప్పుడు ప్రజల్ని సంభాళించడానికో హేతుబద్ధమయిన గమనశక్తీ, విధానపరమైన అధికారం అవసరం. ఈ అధికారం చలాయిస్తున్నవారు వివిధ సంఘాల్నుంచి, తరగతుల్నుంచి వొచ్చారు. అనేక రకాల ఆపేక్షలు వారికుండొచ్చు. అది వేరే విషయం. కాని పరిపూర్ణ ప్రజాస్వామ్య దృశ్యమనేది మనల్ని మనం సమూలంగా మార్చుకున్నప్పుడే సాధ్యమవుతుంది. జీవన మూలాల్లోంచి మార్పుని జీర్ణించుకున్నప్పుడే సంభవమౌతుంది. మనకొరకు, మన కుటుంబం కొరకు మాత్రమే కాకుండా, మన పొరుగువాళ్ళకోసం, సాటి మనుషులకోసం, సమాజం కోసం బతికినప్పుడే సంపూర్ణ ప్రజాస్వామ్యాన్ని సాధించేందుకు అవసరమైన అభివృద్ధి కనిపిస్తుంది.

నేను మొరపెట్టుకుంటోంది కేవలం ఆర్థిక మార్పు మాత్రమే కాదు, సామాజిక మార్పు, రాజకీయ మార్పు మొత్తంగా జీవన దృక్కోణంలో, జీవిత ప్రాథమిక విలువల్లో సమూల మార్పు. ఇది సాధ్యం కాదని మీరనవచ్చు. మానవ ప్రవృత్తికే ఇది విరుద్ధమని మీరు వాదించొచ్చు. ఐతే, నేనది అంగీకరించలేనని మాత్రమే చెప్పగలను. ఒక్కడిగానున్నాసరే నేనది ఒప్పుకోలేను. మనిషిని స్వార్థానికి లోనుచేసే నిర్బంధత్వం మానవ స్వభావంలో ఏదైనా వుందేమో నాకు తెలీదు. ఐతే, మనిషిలో జీవరసాయిన సంబంధిత ప్రేరణ కారణంగా వ్యక్తిగత, సాంఘిక, రాజకీయ స్వప్రయోజనాలకోసం స్వరక్షణ చర్చలుత్పన్నమౌతాయని అంగీకరిస్తాను. దాన్ని నేను వ్యతిరేకించను. అయినప్పటికీ, సామాజిక ప్రయోజనాలతో ముడిపెట్టి మాత్రమే స్వప్రయోజనాలనేవి నెరవేరగలవన్న విషయాన్ని ఒప్పించడానికే నేను ప్రయత్నిస్తాను.

ఒకదాన్ని కోల్పోయి మరోటి నువ్వు పొందితే నైతిక ధర్మం దండన విధిస్తుంది – ఫలితంగా రాజ్యాలు పతనమౌతాయి, ఆస్తి–అంతస్తులు అదృశ్యమౌతాయి. ఇంకా ఇలాటివెన్నో జరుగుతాయి. ఈరోజు జీవన పద్ధతిలాగే వుంది. అమెరికా, రష్యాలు ఈరోజు ఉపరితలంలో ఉండొచ్చుగానీ, ఈ పద్ధతి ఎలా రూపొందించబడిందంటే ఇందులో ఎవరూ ఉన్నతంగా ఎల్లప్పుడూ కొనసాగలేరు. ఇతరుల్తో పోల్చుకుని విజయాన్ని పొందడమనేదొక జాడ్యంగా రూపొందించబడిన ఈ వ్యవస్థలో వ్యక్తుల మధ్య, సంఘాల మధ్య, వర్గాల మధ్య, జాతుల మధ్య, కార్మిక సమస్యల మధ్య, దేశాల మధ్య ప్రచ్ఛన్నయుద్ధమనేది నిల్చిపోవాలి.

ఇలాటి విప్లవం విజయవంతమవడానికి అవసరమయిన స్థితిగతుల్ని విజ్ఞానశాస్త్రయుగం కల్పించింది. మరెప్పుడూ లేనంతగా, మునుపెన్నడూ కానంతలా ఈనాడు మానవాళిని మరింత దగ్గరకు చేర్చవచ్చు. విద్యని అత్యధికశాతం మందికి అందించవచ్చు. మునుపటికంటే మరింతమంది ప్రజలకి విజ్ఞానశాస్త్ర సత్యాల్ని సులభంగా దరిచేర్చి వారి మనసులు విశాలం చేయెచ్చు. ఈ విజ్ఞానశాస్త్రయుగం మనకు చాటిచెప్పిన సంగతేమిటంటే ప్రచ్ఛన్న యుద్ధానికి కనుక ముగింపు పలక్కపోతే, అది జాతి వినాశానికి హేతువౌతుందని. అయితే, అదెలా ఆగుతుందనే విషయాల్ని మనమందరం కల్సి ఆలోచించాలి. మనకు ప్రజాస్వామ్యం పట్ల విశ్వాసముంటే మన సొంత జీవితాల్నుంచే ఇది ప్రారంభించాలి. మనమంతా ఎవరోకరికి పొరుగువాళ్ళమే కనుక మన పొరుగువాళ్ళతోనే ఈ ప్రయత్నాన్ని మొదలుపెట్టవచ్చును.

ఈ మార్పు•మనలో రావాల్సింది. ఆంతరిక పరివర్తన ప్రజాస్వామ్య ప్రగతికి చాలా అవసరం. బాహ్య బలాలు, నిర్బంధాలు కనీసస్థాయికి తొలగిపోవడానికి గాను ఈ రకమైన సాంఘిక పురోగమనం ముఖ్యం. పరిపూర్ణ ప్రజాస్వామ్య వ్యవస్థెప్పుడూ బాహ్యశక్తులకతీతంగా వుంటుంది. ఇప్పటికైతే అలా అధికారాల కతీతమైన ఆదర్శ స్వప్నంగానే దాన్ని భావించినా, రాజ్యాతీత వ్యవస్థ అనేది ప్రయత్నించాల్సిన ఆదర్శంగానే వుంటుంది. మనం దాన్ని సాధించలేకపోవచ్చు, కాని దానికోసం చేసే ప్రయత్నం వల్ల ప్రజాస్వామ్య విధానం పురోగమిస్తుంటుంది. గాంధీజీ అన్నట్లు, (నిజానికిది ఆయననలేదు, తరచుగా వాడారంతే) "ఏ ప్రభుత్వమైతే తక్కువగా పరిపాలిస్తుందో అదే అంత గొప్ప ప్రభుత్వం" (That government was the best which governed the least) ఇవాళ ప్రభుత్వం ఎక్కువగా పాలించాలని అందరం అనుకొంటున్నాం, ఇంకోవైపు స్వేచ్ఛను కూడా ఆశిస్తున్నాం. ఈ రెండూ పరస్పర విరుద్ధమైన అసంగత విషయాలు. అందుకే, ఈ పద్ధతికి భిన్నమైన సామాజిక వైఖరినొకదాన్ని మీముందుంచాలనుకుంటున్నాను.

## II

మనకు భారతదేశంలో ప్రధానమైనది ఆహార సమస్య. ఇది అత్యంత ముఖ్యమైన సమస్య. స్టీల్‌మిల్స్‌కంటే, ఇనుప కర్మాగారాల కంటే ముందు ప్రజల కడుపునిండాలి. అన్నిటికంటే ముందు వారి ఆకలి తీరాలి. కానీ, ఈ సమస్యపై స్పందించాల్సిన పనెవరిదీ? దీనిపై ఎవరు బాధ్యత వహించాలి? ఇది భారత ప్రభుత్వ విధి. దానికి ప్రతినిధిగా నున్న శ్రీ రాజేంద్రప్రసాద్‌గారి పని. బొంబాయి రాష్ట్రంలోనైతే ఇది శ్రీ యశ్వంత్‌రావు చౌవన్ ప్రభుత్వం పని. ఈరోజు మనందరికీ కనిపిస్తున్న



దృశ్యమిది. వ్యక్తియొక్క జీవితాన్ని స్పృశించే మౌలిక సమస్యలు కూడా పైనున్న కొద్దిమంది మాత్రమే పరిష్కరించాల్సి వుంది. ఈరోజు మనముందున్న చిత్రమేమిటంటే సమాజంలో వ్యక్తి కేంద్రంగా ఉన్నాడు. అతడి చుట్టూ కుటుంబం అల్లుకునుంది. సాంఘిక జీవనానికి కుటుంబ వ్యవస్థనేది బలమైన పునాది. కుటుంబమనేది కూలిపోతే మానవ సంస్కృతీ నాగరికతలు మనగలవని నేననుకోను. వ్యక్తీ, అతని కుటుంబం, ఇవికాక ఇంకేమున్నాయి మనకీరోజు? ఒక గొప్ప సమాజం, అతిపెద్ద వ్యవస్థ, వ్యక్తి కుటుంబంతో సహా వ్యవస్థనే సముద్రంలో కలగల్సిపోతాడు. వ్యక్తి ఈ సాగరమంటే భయపడతాడు. భద్రత గురించి అతని వెతుకులాటలో ఏ మోసగాడైనా అతన్ని తనవైపు తిప్పుకోగలడు. ఏ నియంతైనా ఆహార భద్రతకు సంబంధించిన వాగ్దానాల వర్షంతో అతడ్ని ఆకట్టుకుని తనను అనుసరించేలా చేసుకోగలుగుతాడు. భయంతో, అభద్రతాభావంతో బతికే వ్యక్తి కనీసం తన ప్రాథమిక అవసరాల పట్ల కూడా దృష్టి సారించే పరిస్థితిలో వుండడు.

తర్వాత కుటుంబం చుట్టూ జన సముదాయం కల గుంపు ఉంటుంది. మానవ చరిత్రలో తొంభైతొమ్మిది శాతం మంది జనాలు చిన్న చిన్న గుంపులుగానే జీవించారు. మనిషి చిన్న సంఘజీవి, స్వల్పమైన గుంపుల్లో తచ్చాడే జంతువు. బొంబాయి మహానగరంలోనైతే, అంత అనంతమైన యంత్రారణ్యంలో ఒకే వీధిలో, ఒకే సందులో, ఒకే అపార్ట్‌మెంట్‌లో ఉంటూ కూడా ఇరుగు పొరుగులు ఒకరికొకరు తెలీదు. మనుషులు ఈ రకంగా బతుకీడ్చడానికి ఉద్దేశించబడినవారు కాదు. మనిషి సంఘ జంతువు. అతడికో సమూహమవసరం. ఆ సమూహమెలా వుండాలంటే దాంట్లో సహజసిద్ధమైన పద్ధతుల్లో జీవిస్తూ ఒకరికొకరు తెల్సి, ఒకర్నొకరు గుర్తించగలిగి, తోడ్పడుతూ సామాజిక వేత్తలన్నట్లు ముఖాముఖాలు గ్రహించగలిగేలా వుండాలి. కౌటంబిక జీవన విధానసంతరం వుండే సాంఘిక నిర్మాణమిదే. భారద్దేశంలో ఎనభైశాతం మంది ప్రజలు గ్రామాల్లో ఈ రకమయిన సమూహాలుగానే వుంటున్నారు కదాని మీరనొచ్చును. ఐతే, ఈ సమూహాలుండడమే సరిపోదు. వీటితో ఏదోటి మిళితమై వుండాలనుకుంటున్నామే, అదీ ప్రధానం. కుటుంబం తర్వాతవిగా చెప్పబడ్డ ఈ సముదాయాలు సుస్థిరంగా వుంటూ, సమూహంలోని ప్రతి వ్యక్తి ప్రాథమికవశరాల్ని తీర్చి తృప్తిపర్చగలిగేలా నిర్మాణమవ్వాలి. కుదిరినంతలో వ్యక్తి మౌలిక కోరికల్ని తీర్చేట్టుండాలి. ఈ విధమైన సామాజిక దృక్కోణంలో చూస్తే, ఈ రకమైన సాంఘిక శాస్త్రంలో వ్యవసాయాధార - పారిశ్రామిక సమూహాలనేవి అగుపిస్తాయి. ఈ సమూహంలోని సభ్యులు వారి తిండి వారు పండించుకుంటారు, వారి బట్టలు వారే వుత్పత్తి చేసుకుంటారు, వారికి వారే అనువైన వసతి

కల్పించుకొంటారు. ప్రాథమిక విద్యా, వైద్యాలకు సంబంధించిన సేవల్ని ఏర్పాటు చేసుకుంటారు.

ఇది ఇప్పటికిప్పుడు అకస్మాత్తుగా వచ్చేసే ప్రస్తుత వ్యవస్థలాంటిది కాదు కానీ ఉపాధి కల్పన, ఉద్యోగ భద్రత, వస్త్రాలు, ఆహారం, వసతి అందరకూ అందించే నింపాదైన దూరాలోచన. ఇటువంటి భారీ ఉన్నత వ్యవస్థ సాధ్యమైనప్పుడు అనివార్యంగా ప్రజాస్వామ్యం పరిమితులకనుగుణమైన నియమాలకది దారితీస్తుంది. వ్యక్తీ, కుటుంబం, తర్వాత ఈ సమూహం ఇదీ మన చిత్రం. ఈ సమూహానికి దానికదే నెరవేర్చుకోలేని అవసరాలుండొచ్చు; ఈ సమూహానికి వెలుపల ఇదే తరహాలోనున్న యితర సముదాయాలుండొచ్చు – అవన్నీ విస్తృతమైన కోణంలో విస్తరించాల్సినవే. మీరు దాన్ని మండల సంఘమనండి, జిల్లా సంఘమనండి, జిల్లా బాగా పెద్దదవుతుందేమో. ఈ చిన్న సంఘానికో చిన్న కాలవుండి దగ్గర్లోనాక క్షేత్రం వుంటే దాన్ని సాగుచేయడానికో డామ్ కావాల్సుంటుంది. సమూహంలోనున్న మానవ వనరులు, ఇతర వనరులు ఈ పనికి సరిపోవనుకుందాం. అలాంటప్పుడు, ఒక వంద సమూహాలు కలిసి ఆనకట్ట నిర్మాణం చేపడతాయి. అప్పుడు కూడా ఈ వంద లేదా వేయి సముదాయాలు సాధించలేని కార్యక్రమాలు, అవసరాలు కూడా వుండొచ్చు. అందుకే, మరింత విశాలమైన సముదాయాలవసరం వుంటుంది. ఈ మార్గంలో కింది నుంచి పైకి నిర్మాణం చేయొచ్చు.

ఈ ఆలోచనల మధ్య, నేను ప్రతిపాదించినదీ, ప్రస్తుతం అస్తిత్వంలో నున్నది వీటి మధ్య అఖాతమంత వ్యత్యాసముంది. నేనిప్పుడు చెప్పింది గాంధీజీ చూసిన నూతన వ్యవస్థ స్వరూపం. దిగువ అట్టడుగు స్థాయిలోని ప్రజలు అత్యధికంగా అధికారాన్ని చెలాయించాలనీ, అదే సమయంలో పైనున్న ఎగువస్థాయివారు అల్పాతి అల్పంగా వినియోగించాలనీ ఆయనంటారు. రైల్వే వ్యవస్థ, విమాన సదుపాయం, పోస్టల్ వ్యవస్థల కంటే కూడా ముందు మనకు తిండి, బట్ట, నీడ వుండాలి. వీటి అనంతరమే, ఎంతటి సౌకర్యాలైనా. ఈ సమూహాల్లోని సభ్యులంతా వీటి విషయమై సమాన బాధ్యత కలిగుంటారు. ఈ విషయంలో సమూహమంతా సమానమే. ఇక మరింత చెప్పుకోవాలంటే, ఈ రోజు ఢిల్లీ నగరానికి ఈ ప్రకారంగా చూస్తే పెద్దగా అధికారాలేమంతగా ఉండవు. ఏవో కొద్దిపాటి రక్షణ సంబంధిత, ద్రవ్యానికి సంబంధించినవి ఇతర చిన్న చిన్న అధికారాలుండొచ్చు – కాని ఈరోజు వర్తమాన వ్యవస్థలోని పరిస్థితికంటే అనేకరెట్లు భిన్నంగా వుంటుంది. ప్రస్తుతమున్న వ్యవస్థలో కూడా పార్లమెంటు, రాష్ట్ర అసెంబ్లీలు, జిల్లా బోర్డులు, గ్రామ పంచాయితీలు



ఉన్నాయి. కాని మొత్తంగా గాంధీగారి తలంపులు మట్టుకు త్రోసిపుచ్చబడ్డాయి. ఒకవైపు పార్లమెంటుకి విశేషాధికారాలుంటే, మరోవైపు గ్రామ పంచాయితీకి నామమాత్రపు అధికారాలు, హాస్యాస్పదమైనవి మాత్రమే ఇవ్వబడ్డాయి. నిజానికిది ప్రజాస్వామ్యం పేరెట్టుకున్న వ్యంగ్య ప్రహసనం.

మనిషికీ మనిషికీ మధ్య జరుగుతున్న ప్రచ్ఛన్న యుద్ధాన్ని నిర్మూలించదలచిన ఉద్యమం ఈరోజు దేశంలో కొనసాగుతోంది. భూదానోద్యమం గ్రామదానోద్యమంగా మారింది. గ్రామదానోద్యమమంటే ఒక గ్రామంలోని భూమంతా సమిష్టిగా ఆ గ్రామస్తులందరి ఆధీనంలో వుంటుంది. దానిపై ప్రతీ గ్రామస్తుడికీ హక్కుంటుంది. వ్యక్తిగత యాజమాన్య హక్కు బలప్రయోగంతోనో, బలాత్కారంగానో కాక స్వచ్ఛందంగా యజమానులే ముందుకొచ్చి వారి భూమి ఇకపై అందరిదీనని ప్రకటించడం జరుగుతుంది. అప్పుడిక అంతులేని తగువులు, తగాదాలన్నీ అదృశ్యమైపోతాయి. ఎప్పుడైతే భూమంతా గ్రామానికంతటికీ జీవనోపాధి కల్పించే ప్రధాన వనరుగా వుంటుందో, సమూహపరమౌతుందో, అప్పుడిక వ్యక్తుల నడుమ అంతర్గత ప్రచ్ఛన్న యుద్ధాలనేవి మొత్తంగా కాకపోయినా తొంభైతొమ్మిది శాతమైనా నిర్మూలించబడతాయి.

సంపూర్ణ సహకార సముదాయాలతో వృద్ధిచెందే సమూహాల్నేర్పర్చడం సాధ్యమే. అలాగే గ్రామంలోనైతే ఆహారం, వస్త్రాలు, వసతి, విద్య, ఆరోగ్యం, ఉపాధి, అవసరమైన యంత్రశాస్త్ర సాంకేతిక పరిజ్ఞానానికి సంబంధించిన ప్రణాళికను గ్రామస్తులంతా కలిసికట్టుగా చర్చించుకుని రూపొందించుకోవచ్చు. ఏ రాజకీయ పార్టీల నిమిత్తం లేకుండా గ్రామసంబంధ వ్యవహారాలు జరగడమప్పుడు సాధ్యపడుతుంది. సమిష్టిగా తీసుకునే నిర్ణయాలు అప్పుడే ఏకగ్రీవంగా అమలౌతుంటాయి. సాంఘికంగా తీసుకున్న నిర్ణయాల్ని అనుసరించడం అప్పుడే జరుగుతుంది. నిర్ణయాలు తీసుకోడంలో అభిప్రాయ భేదాలు తలెత్తినప్పుడు ఏ నిర్ణయాలూ తీసుకోబడవు. అక్కడెవరూ స్వప్రయోజనాల కోసమో, స్వార్థపూరిత వైషమ్యాలతోనో వుండరు కాన కొట్లాటల గొడవ లేకుండా సామాజిక అభివృద్ధి కొరకు పాటుపడాలని భావిస్తారు కాబట్టి అభిప్రాయ భేదాల్ని సామరస్యంగా సవరించుకుని పరిష్కరించుకుంటారు. ఒప్పందానికి అనుగుణమైన క్రమమే కనుగొనబడుతుంది.

క్వేకర్స్ (Quakers) అనే క్రైస్తవ ప్రచారకులు తమ సమూహాల్లో ఏవైనా భేదాభిప్రాయాలు తలెత్తితే, వాళ్ళిక ఇరవై ముప్ఫయి నిమిషాలు మౌనంగా కూర్చుని

సమస్యకేమైనా పరిష్కారం లభిస్తుందేమో చూస్తారు. లేకపోతే, ఒక నెల తర్వాతో, ఆం నెలల అనంతరమో తిరిగి కలిసి సమాధానాన్ని సామరస్యంగా పరిష్కరించుకొంటారు. చాలా కాకపోయినప్పటికీ యూరప్‌లో ఇలాంటివి కొన్ని సంఘాలున్నాయి. నేనైతే వాట్ని సర్వోదయకు బాహ్యరూపాలుగా చూస్తాను. ఇవి స్వతంత్రమైనవి, గ్రామదానోద్యమంతో వీటికెలాంటి సంబంధం లేదు. అవి యూరోపులోనే పుట్టాయి. ఫ్రాన్సులోనైతే వీట్నివి శ్రామిక సమూహాలుగా పిలుచుకుంటాయి. ఈ సమూహాల్లో ఎన్నికలు, నిర్ణయాలు కూడా ఏకగ్రీవంగానే జరుగుతాయి. ఇలాంటి విధానాన్ని కనుక సృష్టిస్తే, పార్టీలకిక తావుండదు. భారద్దేశంలోని అన్ని గ్రామాలల్లోనూ ఈ రకమైన పార్టీరహిత ప్రజాస్వామ్య పద్ధతిని ప్రవేశపెట్టి పనిచేస్తే, అది ఈ దేశ రాజకీయ రంగ నిర్మాణంలో ఒక గొప్ప విప్లవాన్ని తీసుకొస్తుంది. రాజ్యాంగం నుంచి మొదలుకుని అన్నీ కూడా దిగువ నుండి మార్చబడాలి. అలా అంతరిక, బాహ్య విప్లవాలు జరక్కుండా ఇది కచ్చితంగా పనికొస్తుందని చెప్పజాలం కాని దిగువస్థాయిలో పనికొస్తుంది. ఇలాంటి ప్రజాస్వామ్యం జనాలకు దగ్గరగా వుంటుంది. పూర్వం ఏథెన్సులో అభ్యసించిన ప్రత్యక్ష ప్రజాస్వామ్యం లాంటిదిది. పౌరులందరూ బజారులో కల్సుకొని చర్చించుకుంటారు. నిర్ణయాలన్నీ కూడా ప్రజలచేతే తీసుకోబడతాయి. అలాగే, గ్రామ సచివాలయాలు కూడా సమావేశమై నిర్ణయాలు తీసుకుంటాయి. ఆ నిర్ణయాలనేవి జగడాలకోసమో, ఎడ్లబళ్ళపై పన్నులు వేయడం కోసమో అక్కడక్కడా అరకొర దీపాలు పెట్టడం కోసమో కాకుండా ఆహారం, వస్త్రాలు, వసతి, విద్య, వైద్యం, ఉపాధి మొదలగు నిజమైన సమస్యలపట్ల దృష్టి సారించడం జరుగుతుంది.

సరైన పథకాన్ని రూపొందించుకుని ప్రయత్నించడమనేది ఈ సమూహాలకు సాధ్యమే. ప్రాంతీయ సహకారం ద్వారా పైకెదిగేందుకు ప్రణాళికాబద్ధంగా వ్యవహరించడం ఈ సమూహాలకు సాధ్యమే. మీరనొచ్చు, ఈ సంఘాలన్నీ వేటికవి వేరయిపోయి వాటి సొంత ప్రయోజనాల్నే కాని ఇతర సమస్యల్ని పట్టించుకోవేమోనని. అసలా విధమయిన పక్వత నొందిన అంతరిక మార్పు సమూలంగా రానప్పుడే ఇలాంటి రకరకాల భయాలు, ఆందోళనలు తలెత్తుతూ దేశ, ప్రపంచ జీవన మార్గాన్ని భంగపరుస్తుంటాయి. అలా అవకుండా, ఎప్పుడైతే అంతర్గత మార్పొస్తుందో, అప్పుడిక ఏ గ్రామమూ తన స్వప్రయోజనాలకే ప్రాధాన్యతనిచ్చి సమిష్టితత్వాన్ని తులనాడుతుందనే అనుమానానికి తావులేదు. ఒక గ్రామంలోని సంఘ ప్రయోజనాలకు మరో గ్రామంలోని సంఘ ప్రయోజనాలే మాత్రం విరుద్ధంగా ఉండవు.



దిగువ నుంచి వికేంద్రీకరణ (వెర్టికల్ డిసెంట్రలైజేషన్) జరిగి సాంఘిక, ఆర్థిక, రాజకీయ వ్యవస్థలన్నీ పునర్నిర్మించుకోవల్సిన అవసరాన్ని కూడా నేను నొక్కి చెబుతాను. ఈరోజు రాజ్యం అనేకానేక కార్యక్రమాలు చేపడుతోంది. వాస్తవంగా రాజ్యవిధేమిటంటే జనాభాలో ఐదు శాతమున్న అశాంతిపరుల్నీ, చట్ట ధిక్కారకారుల్నీ అదుపులో పెట్టడం, శాంతి భద్రతల్ని కాపాడటం. మరప్పుడు సంక్షేమ రాజ్యం, సమాజవాద ప్రభుత్వం, సమాన శ్రేయోరాజ్యమన్న ప్రతిపాదన వృద్ధవుతుంది. రాజ్యమే రైల్వేల్నీ, పోస్టాఫీసుల్నీ, జీవిత బీమా సంస్థల్నీ, ఉక్కు కర్మాగారాల్నీ నడపాలనడంలో వివేకమేమి లేదు. అంటే, దానర్థం, కొత్త సమస్యలు తెచ్చిపెట్టే ప్రైవేటు యాజమాన్యానికి కట్టబెట్టమని కాదన్న సంగతి నా ప్రాథమిక ఆలోచనల్ని చూస్తేనే అర్థమవుతుంది. అలాంటప్పుడు రాజ్యంతో సంబంధం లేని స్వతంత్ర పౌర సమాజపు ప్రజా సంఘాల ఆధ్వర్యంలోనో, ప్రజల ప్రాతినిధ్య సముదాయాల సహకారంతోనో అవెందుకు నడపబడకూడదు? మన రైల్వేలకు స్వయం ప్రతిపత్తికల పద్ధతెందుకు లేదు? ఒకే ఒక్క స్వయం ప్రతిపత్తిగల సంస్థకి బదులు ఆ స్థానంలో ఆరో, పదో స్వపరిపాలనాధికార స్వయంప్రతిపత్తిగల సంఘాలెందుకుండకూడదు? వివిధ రకాలయిన పనుల్ని నిర్వహించుకుందుకు ప్రజలు నూతన నిర్మాణాలను తిప్పి కొడతారా? కార్యక్రమాలు కచ్చితంగా నిర్దిష్టమయిన పద్ధతిలో నిర్వహించాల్సిందే. కాని, ఆ నిర్వహించేది ప్రభుత్వం 'మాత్రమే' ఎందుకవ్వాలి? ప్రభుత్వం మాత్రమే విద్యా సంస్థల్నీ, వైద్య విధానాన్నీ సాగదీస్తూ కొనసాగించాల్సిన అవసరమేముంది? ప్రజలే ఎందుకు చేయకూడదివి? ఇంతకీ ఈ డబ్బంతా వస్తోందెక్కడ్నుంచి? సొమ్మొచ్చేది ప్రజల్నుంచే. అధికారులు, నిపుణులు, ఉపాధ్యాయులు, వైద్యులు ఎక్కడ్నుంచొస్తున్నారు? ఢిల్లీలో వీళ్ళందర్నీ వుత్పత్తి చేసే ఫ్యాక్టరీలాంటిదేదైనా వుందా? వీరంతా ప్రజల్లోంచే వస్తున్నారు. మరలాంటప్పుడు మనమో ప్రధానకేంద్రం పెట్టుకొని ప్రతీ విషయానికీ దాని వద్దకు పరుగెత్తడమెందుకు? అక్కడ్నుంచే అన్నీ కొనసాగించడమెందుకు? గ్రామాల్ని యధాతథంగా కాపాడుతూండమని నేనేం చెప్పడంలేదు. గ్రామాలు ఇప్పుడున్నవి కచ్చితంగా మారాల్సిందే. కాని ఒక్క విషయంలో మాత్రం గ్రామం కాపాడబడాలి. అదేంటంటే, సమూహ సంఘ విధానం. ఈ చిన్న సమూహ జీవన సంఘాలనేవి వ్యవసాయ సంఘాలుగానే కాక వ్యవసాయ – పారిశ్రామిక సమూహాలుగా, మరీ పెద్దవికాని బృందాలుగా వృద్ధి చెందాలి. మనం సాంస్కృతిక ఉత్పత్తి ఫలితాలం నిజమే, కాని మనం ప్రాకృతిక ఉత్పత్తి ఫలాలం కూడా.